179

Rg N. 757.

# అభినవసరస్వతి

యను నొక మాసపత్రిక

అష్టావధాని జానపాటి పట్టాభిరామశాస్త్రిచే

ప్రచురింపఁబడుచున్నది.

గుంటూరుజిల్లా, పల్నాడుతాలూకా, జానపాడు

సంపుటము ౮ } 1916 సం॥ మే { సంచిక 5

విషయములు.



చందానిర్ణయము సంవత్సరమునకు

ప్రధానపోషకులకు రు 25 0 0 సహాయులకు రు 5 0 0

పోషకులకు రు 10 0 0 చందాదారులకు 2 0 0

చంద్రికాముద్రాక్షరశాల, గుంటూరు.

Printed at the Chandrika Press, Guntur
and published at Janapadu, by the Editor Ashtavadhani
Janapati Pattabhirama Sastry.

ప్రి ధా[redacted]పో[redacted]మ[redacted]లు.

-గద్గురుపుష్పగిరి[redacted]వారు

## పోషకులు.

1 రాజా నారయప్పా రావు సింహాద్రప్పా రావు బహాదరు జమీాందారులు, నూజవీడు

2 రాజా వెంకటాద్రి అప్పా రావు బహాదరు జమీాందారు గారు, నూజవీడు.

3 రాజా వాసిరెడ్డి చంద్రమౌళీశ్వర ప్రసాదు బహాదరు మన్నే సుల్తాన్ జమీాందారుగారు, ముక్త్యాల

4 అల్లాడి లక్ష్మణరావు గారు కరణము జంగపల్లి

5 రామసింగు గారు నెల్లుట్ల పాపరపు సంస్థానము మేనేజరు నెల్లుట్ల

6 రంగావఝ్ఝుల హనుమయ్యగారు జిల్లాకోర్టు వకీలు గుంటూరు.

7 తాడేపల్లి లక్ష్మీనరసింహారావు గారు ముక్తాదారు చొల్లేరు.

8 అనంతరెడ్డి దేశాయి గారు పోతారెడ్డి పేట

9 నూదూరు వీరసాంబశివరావు సర్దేశపాండ్యా గారు, మాలెకొండూరు

10 పాములపాటి సుబ్బయ్యగారు, విలేజి మునసబు, నిమ్మబ్రోలు.

## సహాయులు.

1 తంగెడ నరసింహారావు గారు, కరణం, మోజర్లంపాడు.

2 బీరకాయల రామారావు దేశముఖు గారు రాయగిరి

3 పరాంకుశం శేషాచార్యులు గారు యాదగిరి

4 నరసింహాచార్యులు గారు-పట్వారీ-కొలనుపల్లి

5 తోర్లకొండ హనుమంతరెడ్డి గారు లోలంవర్తి రాసేగ్ దారు, యల్లారెడ్డిపల్లె

6 వెంకట నారసింహారెడ్డి దేశముఖు గారు-మిడిదొడ్డి

7 మందడి శేషారావు దేశముఖు గారు, నల్లబల్లి

8 బాల రాజా పరాంకుశ రావు దేశముఖు గారు, యాదవరము.

9 కుప్పా శంకరశాస్త్రి గారు, చివలూరు

10 హాజీబు వెంకటరామారావు గారు వకీలు సిరిసిళ్ళ

11 నరసింహారెడ్డి దేశాయి గారు, కొసరబాద

12 కామమాను హనుమయ్యగారు నర్సారావు పేట

13 మొలుగూరి పిచ్చయ్యగారు కొదమగుండ్ల

...మద్రిసోమ రాజులు గారు, తహసీలు దారు నర్సారావు పేట

...టుకుమళ్ళ గోపాలరావుగారు, కరణం, అమీదీపురం

16 ఉల్లగంటిపీర రాఘవరావు గారు, ముక్తాదారు. ఆనేపురం

17 శ్యామాపంతుల వెంకటేశ్వర రావు గారు తహశీల్ దారు-జగితాల

18 పాకుంట శంకరరావు దేశపాండ్యా గారు-జగితాల

19 పట్టివర్ధనం సీతారామరావు గారు-వకీల్-కంభంమెట్టు

# అభినవసరస్వతి

సంపుట 8 — జూనపాడు. నలనామ సం॥ వైశాఖమాసము. — సంచిక 1


## ఆంధ్రసాహిత్యపరిషత్పంచమవార్షికోత్సవము.

ప్రస్తుతము గుంటూరునం దసిస్టాంటుకలెక్టరుపదవి నధిష్ఠించియున్న శ్రీ జయంరామయ్యపంతులుగారు సంస్కృతాంధ్రములయందు సాహిత్యముసంపాదించి యదాంధ్రభాషయం దత్యంతాదరముగల్గి పలువురుజమీందారులను ధనవంతులను బుద్ధిమంతులను దగుప్రోత్సాహ మొసంగుచు నాంధ్రభాషాభివృద్ధికై యాంధ్రసాహిత్యపరిషత్తు పేర నొకసభ యేర్పఱచియుండుట సర్వజగద్విదితము. ఆయాంధ్రసాహిత్యపరిషత్పంచమవార్షికోత్సవ మీసంవత్సరమున నేప్రియల్ 21, 22 తేదీలను గుంటూరు కాలేజీలో జయప్రదముగ జరుగనయ్యెను. పలుదిక్కులనుండి పలువురువిద్వాంసులును శ్రేష్ఠమనుష్యులును నీసభకు విచ్చేసిరి. ఇతరగ్రామములనుండి యాగతులైన మహాజనులు నైనూర్లులో దృష్టికరముగు విందుగావించిరి. కొంతమందివిద్వాంసులకు మాత్రవ రాకపోకలకర్చులుకూడ నొసంగిరి. విద్వత్కవులును విద్వత్పత్రపాఠులును విశ్వాంరాధీశులును విత్రకుతోడారులును విధ్వస్తగర్వులును వివిధసద్గుణులును నగు శ్రీ రాజమంత్రిప్రెగడ భుజంగరావుగారు గ్రిసనాధిపతులై సభకంతటికిని వన్నె వెచ్చిరి శ్రీరామయ్యపంతులుగారు కార్యనిర్వాహకసభ్యులలో ప్రథములై బహుజాగరూకతతో ప్రత్యూహావకాశము లేకుండ బరిషత్తును బాగుగా నెరవేర్చిరి. సభ కంతసంబధించిన దైనను గాకున్నను కట్టాపాపయ్యశాస్త్రిగారు వసుచరిత్రలోనిపద్యముల రాగస్వరలయోపేతంబుగాఁ బఠించి ప్రేక్షకులకు బ్రీతినొడఁగూర్చిరి. వెంగళూరునివాసలగు టి. సుబ్బరాయశాస్త్రిగారు, ఆంధ్రభాషోత్పత్తి మొదలగు వివిధవిషయముల విషయముగ బోధించిరికాని తద్వాక్యశ్రుతిస్మృతిపురాణేతిహాసమాత్రాత్మకంబై నవనాగరికులకు విరుద్ధంబై యుండుటవలనను ప్రస్తుతకాలపు సభికులు నూటికి డెబ్బదియుండాగరికతేయగుటవలనను గార్యనిర్వాహకులు తచ్ఛాస్త్రిగారియుపన్యాసమునకు దనంతయవకాశమీయక మఱియొకదినమును బ్రత్యేకించి పెట్టుకొనిరి. నేఁడు పలువురు పలువిషయములు నుపన్యసించిరి కాని యొక వ్యుత్పత్తిచిన సీతారామస్వామిశాస్త్రిగా యుపన్యాసమును వినినంత యాదరముతోఁగాని యంతనిశ్శబ్దముతోఁగాని సభికుల తక్కినవానిని వినక కోలాహలముచేయుచుండుటయు గొప్పవట్ట ననిష్టసూచక కరతాళధ్వనులు గావించుటయు సంభవించినది. శ్రీసీతారామస్వామిశాస్త్రిగారు సంస్కృతాంధ్ర

ములయందు మంచివిద్వాంసులును నుభయవ్యాకరణవిదులును నయి సభారంజకతాశక్తి చాలఁగలవారగుదురు కాని పురోభాగిత్వ మెక్కువయున్నదని కొందఱువిద్వాంసుల కంతతృప్తికరములుమాత్రముకాలేదు. కార్యక్రమములో నిర్ణీతులగువారి యుపన్యాసములన్నియు ముగిసినతర్వాత శ్రీ పేరికాశీనాథశాస్త్రులవారును సూరిసుబ్రహ్మణ్యశాస్త్రులవారును నాంధ్రభాషాభివృద్ధితోపాటుగ సంస్కృతభాషనుగూడ వృద్ధిపఱచుటకీసభవారు కొంత యవకాశముతీసికొనవలెనని యుపన్యసించిరి. తదుపరి శతావధానులగు శ్రీ దివాకర్ల తిరుపతిశాస్త్రులు గారును, శ్రీ కాశీకృష్ణాచార్యులు గారును, చివుకుల వెంకటాచలశాస్త్రి గారును, ముదిగొండ నాగవీరశాస్త్రి గారును కొన్ని పద్యములఁజదివి సభికుల నానందపెట్టిరి. అటుపిమ్మటఁ గొప్పరపుసోదరకవులు మువ్వురును నుపన్యాసవేదికనెక్కి కాతురాగులై యేమియో కొన్ని పద్యములఁ జదివిరి కాని యవి సభికులరంజింపఁ జేయఁజాలకపోవుటయేగాకుండఁ బరిహాసపాత్రములై మహాకోలాహలమునకుఁ గారణములైనవి. కొంతమంది పేపరులలోఁ బ్రచురించినట్లు గంటకేడెనిమిదినూర్లు చెప్పకపోయినను నింతకుఁబూర్వ మాశుకవిత్వమని చెప్పువారిలో గొప్పరపుఁగవులే యగ్రగణ్యులై తమ యనర్గళకవితాధారచేఁ బలువురకుఁ దృప్తిచేయుచుండిరి. ప్రకృత మాధార నామావశిష్టమైనను స్వప్రాగల్భ్యములువీడని గొప్పరపుసోదరులపై సభకంతటికిని సర్వాసహ్యముజనించి మృదువాక్యములచే దిగమని తుదకు బలాత్కారముగ వేదికపైనుండి క్రిందికి దింపివేసిరి. నాటకప్రోత్సాహసంఘమునఁ బ్రథములగు పురాణం సూరిశాస్త్రి గారియుపన్యాసమునఁగూడఁ గొప్పరపుఁగవులఁ గాలమునఁ జరిగినంతకోలాహలము జరిగినను బట్టువీడక కోలాహలమును నిలిపింపఁజేసి యుద్దిష్టముం బూర్తిచేసిరి. కార్యనిర్వాహకసభ్యులు స్వప్రయత్నము నంగీకరించినను నంగీకరింపకున్నను నిన్నియంతరాయములకోర్చి కోలాహలమును సభ్యవర్యులచే తనే యాపింపఁజేసి స్వోపన్యాసమును ముగింపఁగలిగిన సూరిశాస్త్రి గారిసాహసమెంతయుఁ శ్లాఘ్యము. ఇట్టిపలువిషయములలో సభముగియుటయును ప్రస్తుతవార్షికోత్సవమునకుఁ గడపనుండివచ్చిన జనమంచి శేషాద్రిశర్మగారు రాహ్వానముం గావించిరి. ఆకీతి పింగళవత్సరమునవగుసభ కడపలోఁ గావింప నిశ్చయించి సభముగించిరి. అగ్రాసనాధిపతులు తమశాంతస్వభావమును నిగర్వశిరోమణిత్వమును వెల్లడించుచునంతోపన్యాసమునుమాలుగాఁ దమవిద్వత్కవితాభివ్యంజకములగు పద్యములచేతనే సభకానందమునొసంగి జయజయధ్వానములలో సభనుండిలేచిరి.

సౌమ్యసద్వృత్తిపదవి దౌర్జన్యగతిని
జెలఁగె,హీనుల కౌనె సుస్థిరగుణంబు॥ 144

—♦ చంద్రదూషణ. ♦—

సీ॥ ప్రబలార్జునోరు విగ్రహాజాతబహుళార్తి
ఖేదంబుచేఁ దగఁ గృశతగనుట
హరివిరోధావాప్తి నలరారియుంట శ్రీ
రామాహితానూనధాముఁడగుట
దాక్షాయణీప్రియ తాత్పర్యగుణిఁ గాంట
చటులదోషాకరోజ్జ్వలతగనుట
పద్మినివైధవ ప్రతికూలుఁడై యుంట
కౌటిల్యహృదయ విఖ్యాతియగుట
గీ॥ పొసఁగ దశకంఠునకు సరిపోల్పవచ్చు
అయ్యయో!యిటువంటిచంద్రున కరయ దయయు
సత్యశౌచంబులును గల్గఁజాల వెపుడు
పాంథు లేగతి వీనిచే బ్రదుకువారు॥ 145

సీ॥ బంధురకార్శ్య సంబంధంబె తెల్పు స
ర్వౌషధీశ్వరుఁడను టనృతమగుట
ప్రామర్త్యగతిఁ గృష్ణపక్షంబె(బోధి)ంచు
ఘనకళానిధియను టనృతమగుట
పాంథతనూజాత పాటవంబే( చెప్పు)
హైమకరుఁడను టనృతమగుట
కడిఁగి కళంకంపుఁ గప్పునిరూపించు
నమృతధాముఁడను టనృతమగుట
గీ॥ అకట!యాథార్థ్యమై కానవచ్చునుండ
చతురవాగ్ధోరణీ విలసత్ప్రశస్త

నిపుణత విశేషమహిమ నన్నిరజారి
యందు బుధులెంతు రది యేమియలఘుమతము॥ 146

సీ॥ పటుకాయమానాగ్ర జటిలోల్లసిత ఫుల్ల
మల్లికాకుసుమగళ న్మధురసంబు
మల్లికాకుసుమగళ న్మకరందపారణా
ప్రీతభృంగాంగనా గీతరవము
ప్రీతభృంగాంగనా గీతసముద్భూత
సహకారకిసలయ సంచయంబు
సహకారకిసలయ సంచయగ్రసన స
త్కలకంఠవర కుహూంకారరుతము
గీ॥ తలఁప నేతత్స్థలంబున నిలువకుండ
పరిసరావని నత్యంతబంధుగోత్ర
వేదనాపాదనానూన విలసనముల
నదరుపుట్టింపఁజొచ్చె నేమనఁగవచ్చు॥ 147

వ॥ అని యుత్తలంబగుస మోహావిభ్రాంతచేతస్కుండై పలుకు
చున్న యన్నరవరసుమశేఖరుం గనుంగొని మృదుమధుర సరసవచ
నరచనా ప్రాచుర్యతిరస్కృతవాచస్పతియగు మంత్రికుమారశేఖరుం
డిట్లనియె, 148

చ॥ “విరహాభరోగ్రతాపమున వేఁగఁగనేల నృపాలచంద్ర! నీ
వరయఁగఁ గామినీజన నవాంబురుహస్ఫురితేక్ష వట్లుగాన(ని
న్నరమనురక్తి) గన్న లలనామణి మన్మథచండకాండ రూ
క్షరితశరీరయై మరుని సొక్కదె నీకు దక్కదే. 149

మ॥ స్థిరచింతాభర మొందనేటికిఁక వాగ్దేవీమనోభర్త త
త్సరసీజేక్షణ నంబుజాలయను దైత్యధ్వంసికింబోలె భా
సురలీలన్ ఘటియించునీకు నిజ మోక్షోణీశ! వెయ్యేటికీ
సరసప్రాభవులెన్న మీర లహహా! సంకల్పసిద్ధుల్ కదా”. 150

క॥ అని తత్కన్యాసందో ర్యనలోల సచిత్తుఁ డత్రిజైత్రుని శశ్వ
ద్వినయాతిశయములొప్పఁగ గొనిచనఁగా నంత నెగుటుఁగుఁ దరలీలన్.

సీ॥ అనుకూలగతిఁ బిచేఁ దనర శీతలగంధ
బంధురోన్నతులొప్ప గంధవహము
కుడిభాగమున నుండి యెడమదిక్కున కేగ
పత్రిశేఖర దుగ్ధపత్రరథము
లల్లనల్లనఁ బ్రదక్షిణంబుగా వచ్చి
గోమాయువులు చూడ మోఁగుటెల్లె
వీణ రథ స్త్రైణ మాణిక్యమయ పాణి
వీణాకలధ్వనుల్ వినఁగనయ్యె

గీ॥ కలయఁబల్కెను దగఁ బైడికంటిజోడు
ఇట్టిశుభశకునంబుల కెలమి నతుల
హర్షసంభరణ ప్రాంచ దంతరంగుఁ
డగుచు నవ్వనిఁ గొంతద వ్వరిగియరిగి. 152

వ॥ అయ్యెడ నయ్యవనీశ్వరవరనందనులు వన్నెమిగిలి మిన్ను దన్ని చెన్నుగల కన్నెపొన్నగున్నలదండ నెన్నిక కెక్కు చిన్ని సన్న హొన్న గన్నేరులపై మొల్లంబుగా నల్లిబిల్లిగా నల్లుకొనిన మొల్ల మల్లెవిరిదుమారంపుఁదిప్పల నొప్పుగల పొరుగుల నొప్పు గరుగులమరు గులకరిగి ముప్పిరిపెనంగిన యేలకతీఁగెలుగప్పుకొని మెప్పుగుల్కుచు గుప్పుగుప్పునఁ దావులుగుప్పు గొప్ప కప్పురపనంటుల దాఁటఁబోయని గెంటెనలపజ్జ గుజ్జుగొజ్జంగిపొదరిండ్లనుండి దుమికి జోరునం బాఱు తెలిమంచునీటికాలువలదరుల విరుల సిరుల నలరుచుఁజాలుదప్పని బొంకు మల్లియలదండ నండగొని యెడ తెగని నీడలు సేయు దాడినిమ్మలంగూడి పొడిమిగల కోడెనిమ్మల యిమ్ములఁ గమ్మవాసనలు గుమ్మరిలుచుఁ గొదమతుమ్మెదల సొమ్మసిలం జేయు సంపెంగలచెంగట రంగుమీఱిన గేదంగులం బెనంగిన లవంగపుఁదీఁగియల నల్లికొని సొగసై సాగిన

తీఁగెమల్లియలకుఁ బట్టులై కన్పట్టు కలిగొట్టుచెట్టులపై మట్టుమీఱి దట్టంబుగాఁ బాఱిన బండిగురువిందపందులంబుట్టి పొందుగలిగి పందిరుల కందిన ద్రాక్షలఁ గలయంబెనఁచుకొన్న గుద్రాక్షతీఁగెల కెలనవలరు క్రొవ్విరుల కేవల శివిమీఱు పూవుతేనియబావుల దీవుల మావుల మావులకుద్దియై పెద్దగాఁ బెరింగిన గంగరావులతావులకుఁ దొలంకు కలంకుకొలంకుల పోకమ్రాకుల నల్లి వ్రేలు మిరియంపునునుతీఁగె తూఁగుటుయ్యెలల నొయ్యనొయ్యన రేయుంబగలనక యూఁగు రాయంచమగల మగనాండ్రు నిగనిగని చికిలిరంగుమెఱుంగుబంగరుతళ్కులతుదలంబొడమితురంగలించువన్నంపుగాడుపుకుత్తుల సాగిపోసీక యీడిగిలంబడఁ జేయు కురువేరుచప్పరమ్ములముంగిళులఁ గుప్పలుగా గొప్పనుప్పొడిముత్తియమ్ములుదొరఁగు మదురునెమురు హత్తికొని తేటుల తేటలగు పాటల పాటమ్ములైన సురపొన్నకూటమ్ముల సమీపమ్ములమీఱు పారిజాతమ్ములకు జోడులై యున్న మారేడులకు నీడలై చూపడునల్లనేరేడుల మొదళ్లనలరారు జగానెలరాలతిన్నెలకెనపలదాపునఁ బనసల నెనసిన విరజాజులపొదల ప్రోడలై పెరిఁగిన సూదిమల్లియలచేరువ గుమురులైనజాజులనీడల మెల్లనఁజనుచు నారాజన్యనందనుండు తన చిత్తంబున 151

సీ॥ నరశుకాంగనఁ జేరి సరససల్లాపముల్
రహిఁ జేయు రాజకీరంబుఁ జూచి
అంచకామినిఁ గౌఁగలించి మించిన వేడ్క
హర్షంబునొందు రాయంచఁ జూచి
కలనాదమొనరించి కలరవి కెమ్మోవి
చుంబించు పారావతంబుఁ జూచి
ఘననీలచక్రవాకినిఁ గూడి రతికేళి
గావించు మదరథాంగంబుఁ జూచి

గీ॥ చానకడకేగి సరసభాషలువచించి
బిగువుకౌఁగిటఁగదియించి పెదవినొక్కి
రతులఁజెందుటకై చాలమతిఁజెలంగు
రాజచంద్రుండు మోహవిభ్రాంతుఁడగుచు. 154

సీ॥ కాసారములయందుఁ గలువరేకులుచూచి
యంతరంగంబునఁ జింతనొందు
సొగసైన మవ్వంపుసోగతీఁగెలుచూచి
మానసాబ్జమునందు మగ్నమొందు
నునుచాయలఁదలిర్చు ననఁటిబోదెలఁజూచి
చిత్తమం దెంతయుఁ దత్తరించు
పోలుపారు గుత్తంపుఁబూవుగుత్తులఁజూచి
స్వాంతంబునందు విభ్రాంతినొందు

తే॥ గీ॥ సుదతి నిమువాలుకన్నులు చూడఁదలఁచి
సింహమధ్యమ బాహలు వీక్షింపఁదలఁచి
కంబుకంధర యూరువుల్ కనఁగఁదలఁచి
చెలువ వలిగుబ్బదోయి దర్శింపఁదలఁచి॥ 155

వ॥ అప్పుడు రాజచంద్రునకు మంత్రిచంద్రుండిట్లనియె, 156

సీ॥ అప్పొలంతిమోఱుంగు గొప్పకీలొప్పుక
ప్పంధకార మొనర్చె నంతరిక్ష
మక్కాంత నవమందహాసాంకురచ్ఛాయ
దిశలందు సాంద్రచంద్రికలనీనె
అబ్బాల పదహల్లకారుణద్యుతి పద్మ
రాగకుట్టిమఁ జేసె రత్నగర్భ
అక్కన్య రుచిరదేహప్రభ నికటల
తాదుల భగ్నమయుంబొనర్చె

తే॥ గీ॥ అదియకనుగొంటె నిఖిలధరాధినాథ
హితవయస్యశిరోమణుల్ చతురగతుల
నాడికంబులు సేయంగ నుచితలీల
కోకకుచయున్న లవలీనికుంజగృహము॥ 157

వ॥ అని తెల్పిచూపుచు సవిధసరోజాతాకరసంజాత కబంధజాతసౌగంధికబంధుర సుగంధానుబంధి గంధవహాపరంపరాపరికంపమాన విశాలప్రవాళజాల లాలితంబును, నుపరిప్రదేశ పరస్పరజటిల మల్లికాప్రసూనమంజరీ పుంజనిర్గతానర్గళమధురమధురస వారణపరాయణ విభ్రమద్భ్రమరాంగనాసంగీత కలధ్వానప్రదవమానైణాంకదృషద్వితర్దికాంచలాంచన్నిర్ఝర ధారాధారకుల్యా ఘుమఘుమ నిర్ఘోషానుకారికీరభాషావిశేష ఘోషామణిజాలవాచాల చిరత్నరత్నమేఖలాలంబి ఘంటికాతులాకోటి కంకణకింకిణీక్రేంకార కోలాహలబహుళంబును, కాంతాశ్రాంతపరిశ్రాంతి విశ్రాంతికరాత్యంత కాంతస్వచ్ఛతరశీతలచ్ఛాయానికాయ్యనికాయంబును, సామీప్యభాగసమావృత చందన కుచందన కృతమాల తమాల మందార మాకంద మధూకాశోకానోకహసీకవ్యాకోచ కుసుమవిస్ఫుర సారసౌరభవిస్తారంబును, అత్యంతరమణీయంబును నగు నక్కుంజ సమీపంబున నిలిచిన, 158

ఉ॥ స్వాంతముపల్లవింప నృపచంద్రుడు గన్గొనెఁ బొంచి తన్నికుం
జాంతరజాలమార్గముల నల్లనఁ గంధరనీలవేణిఁ గ
న్గాంతవిలాసనేత్రిఁ గనకాంగినిఁ గంజనిభాస్యఁ గాంచనా
త్యంతమనోజ్ఞనాసఁ గరియానఁ గనత్కఠినస్తనద్వయన్ 159
గాంతను గంబుకంఠిఁ గలకంఠకలస్వనఁ గామినీమణిన్.

క॥ కనుగొనినంతనె మనసిజుఁ
డనుపమపికకీరశారికార్భటులొలయన్

నునువాఁడి చికిలికోలల
జననాథవతంసుఁడు జల్లెనఁ గలఁచెన్. 160

వ॥ అప్పుడు 161

శా॥ ఠీవిన్ వెల్వడు పంక్తిసంతమసకోటిం జిక్కి సీమంతరే
ఖావీథిన్ స్తనదుర్గపఙ్క్తియయి వేడ్కన్ హారస్రక్శ్రేణులన్
వేవే డిగ్గు గభీరనాభిసరసీ నిర్మగ్నమై సన్నుతం
బావక్రోత్పులినంబుఁ జేరు పతిచూ పబ్జాక్షిపైఁ బర్వుచోన్. 162

తే॥ కన్యకామణి సకలాంగకములయందు
తిరుగు నృపుచూడ్కి నరికట్టి వరుసనిలుపు
చెఱకుసింగిణిమన్నఁడు, యిఱుకుబిగువు
గబ్బిచన్గట్లనడిత్రోవ గనుమగట్టు. 163

తే॥ మహిళ నెమ్మేన నాపాదమస్తకముగ
నడరి యారోహణావరోహణములఁదిరిగి
యచలమాస్థితి ననిమిషంబైనదృష్టి
యలవడె మహీంద్రునకు నంత నద్భుతముగ. 164

వ॥ అయ్యెడ నయ్యవనీకాంతుం డంతరంగంబున నక్కురంగ
నయన నిట్లని వర్ణింపందొడంగె, 165

క॥ "నరవర విద్యాధర కి
న్నర సుర గంధర్వ యక్ష నాగాంగనలీ
సరసిజపత్రవిలోచన
చరణనఖాంకురముతోడ సరిపోలుదురే. 166

శా॥ మారుం డద్భుతలీల దీని నజుపై మాఱొడ్డి కల్పించెఁగా
కారా! యీ వలిగుబ్బదోయిబిగు వీయందంపుఁగేల్మాప్పుచో
ప్పీరోమావళిపాంక మీనడబెడం గీలుక్కొవాల్కన్నులో
య్యారం బిద్ధరఁ గాకయున్నఁ గలదే యబ్జాక్షులం దెన్నఁడున్॥ 167

సీ॥ కలకంఠరవ మబ్జకంఠి కంఠముగాఁగ
పల్లవమ్ములు బాల పాదములుగ
కలహంస నిభ రాజగమన యానముగాఁగ
బలుతూండ్ల ననబోణి బాహువులుగ
ఘనఘనాఘనము చందనగంధి కొప్పుగ
నక్షత్రములఁ గొమ్మ నఖరములుగ
కరికరంబుల హేమగాత్రి యూరులుగాఁగ
నీరజంబులఁ గాంత నేత్రములుగ
గీ॥ సర్గమొనరించి సహజవైషమ్యగతుల
తలఁచి యన్యోన్యదర్శన స్తంభనముగ
కఠిన కుచశైలముల మధ్యగతముఁ జేసె
చిత్రమాఁగద చతురాస్య శిల్పమహిమ॥ 168

తే॥ అతివ నెమ్మోము పూర్ణసుధాంశుబింబ
మాటఁ దెలిపెడుఁ బక్వబింబాధరోష్ఠ
ఘనసుధాసార సరహాసకౌముదివి
రాజితేక్షణ మృగసమాశ్రియుతఁ జేసి॥ 169

ఉ॥ రాజమరాళిపై నెటుల రమ్యతగాంచెనొ తమ్మిదోయి, రం
భాజగతీరుహద్వయముపై నెటులొందెనొ ధాత్రి, మింటిపై
నోజదలిర్ప నెట్లణఁగియుండెనొ కొండలు, పూర్ణతారకా
రాజుపయిన్ ఘనం బెటులరంజిలెనో కమనక్కజంబుగన్ . 170

క॥ మృగశాబాయతలోచన
జిగినిబ్బర పుబ్బుగబ్బి సిబ్బెపుగుబ్బల్
పొగరణఁచఁబోలు నిత్యం
బగణితముగఁ జెండ్ల గిండ్ల నరులన్ గిరులన్ . 171

ఉ॥ కీరముగా మృదూక్తి, నునుకెంపుజిగిం దగు మోవి సత్సుధా
సారముగా, మనోజ్ఞ ఘనసారముగా తెలితేఁతనవ్వు, పా

తే॥ చెలఁగి యేమాటనే వీరు చెప్పనింక
నట్టి యెచటనో కళ్పంబు పెట్టినటుల
నుండెడింగాని సంబంధ మొక్కయింత
గానఁగాఁబడ దది యేమికారణంబొ. 126

తే॥ అటు లసంబద్ధవాక్యంబు లాడువారి
నోరుమూయించె నల సుధన్వుండు మున్ను
మనదుపరిపాలకుల కట్టి మంచిబుద్ధి
పుట్టినంగాని వీరినోర్మూతవడదు. 127

తే॥ విబుధగురుభాగినేయుఁడో విశ్వకర్మ
గాను దద్విశ్వరూపుండుగాను మరల
నాద్యుఁడౌ విశ్వకర్మయే యవతరించె
ననుచు మనవార లొకయుక్తి ననుసరింత్రు. 128

తే॥ అనుసరింతురుగాక యయ్యాద్యునకును
విశ్వకర్మాఖ్య రూఢమై వెలయవలదె
యోగమున నేని యయ్యాఖ్య యుండనింక
నైదెమొగ్లుంత మాతని కానమలు. 129

ఆ॥ * తలలు వేయిగలిగి తనర నప్పూరుషుం
డన్నిసటికి యుంత్రె యైదుతలలు
వాహవావహావ్వ! వ్రడంగమన నిట్లు
లుండవలయుఁజూడి యుర్వమీఁద. 130

ఆ॥ † ఐదుతలలవాఁడు హరుఁడుగా సివాఙ్క। యోలవుట్టువీరి కితనికిడిరి
వసుధమీఁద నిట్టివారలె కాఁబోలు। తలలుమార్చునట్టి ధన్యతములు.

---

* పురుషసూక్తము

శ్రు॥ సహస్రశీర్షా పురుషః, సహస్రాక్షస్సహస్రపాత్

† శివాష్టోత్తరశతనామములు.

శ్లో॥ హవిర్యజ్ఞమయ స్సోమః పంచవక్త్ర స్సదాశివః.

ఆ॥ వేయుతలలుగల్గువిశ్వమయుండునుఁ । గాఁడువీరిజనికిఁ గారణంబు
ఐదుతలలుగల్గునయ్యీశ్వరుండునుఁ । గాఁడువీరిజనికిఁ గారణంబు.
ఆ॥ తలలుమూఁడుగల్గుతద్విశ్వరూపుఁడునుఁ । గాఁడువీరిజనికిఁ గారణంబు
తలయొకండుగల్గుతద్విశ్వకర్మయునుఁ । గాఁడువీరిజనికిఁ గారణంబు ॥
ఆ॥ అంతరాశపర్ణుడైనమహావిష్ణుఁడునుఁ । గఱణేవీరిజనికిఁ గారణంబు
తామ్రవాసికొన్న తాటాకుపాత్రాలఁ । గలదువీరికన్యకారణంబు॥
క॥ శ్రుతిఁగానిస్మృతులఁగాని । యితిహాసములందుఁగాని యీనానుడికి౯
వ్యతిరేకంబుగనుండినఁ । బతితుఁడనై కలిసిపోదుఁ బంచమజాతి౯ ॥
ఆ॥ * స్వర్ణకారజాతి సర్వధా తద్విశ్వ
కర్మహేతుకంబు కాదు కాన
అతఁడు బ్రహ్మయొక్క యవతారమైనను
దండితనము రాదు దానికరయ॥ 136
తే॥ కాని యర్థంబుమాత్ర ముక్కంటిఁగాదు
నాఁగుచూపినయట్టి యీవాక్యమునకు
నెలయు రెండవబ్రహ్మనా విశ్వకర్మ
యనుచుఁ దద్వాస్తవార్థంబు, కనుఁడు బుధులు ॥ 147
తే॥ † బ్రహ్మకుదయించినటువంటి వారలెల్ల
వసుధ షట్కర్మలం జేయవచ్చునంట

* విష్ణుపురాణములో విశ్వకర్మ బ్రహ్మావతారమని చెప్పఁబడియున్నది

† మనుస్మృతి ౧౦వయధ్యాయము 74వశ్లోకములో బ్రహ్మకుజన్మించినవారందఱు షట్కర్మలుచేయవచ్చునని చెప్పఁబడియున్నది. అర్థము తెనుఁగులో వ్రాయఁబడియున్నది

* విష్ణుపురాణము చతుర్థాంశము ద్వితీయాధ్యాయము.

గద్య॥ తత్ర చాశేషశిల్పకల్పప్రణేతారం ధాతారమివాన్యం విశ్వకర్మాణ మాహూయ......43

† మనుస్మృతి ౧౦ వ యధ్యాయము.

శ్లో॥ బ్రాహ్మణా బ్రహ్మయోనిస్థా యే స్వకర్మణ్యవస్థితాః
తే సమ్యగుపజీవేయుః షట్కర్మాణి యథాక్రమం॥ 24

కం॥ ఈచూపినశ్లోకములో। ప్రాచీనుండోషి యనుచుఁ బల్కునుడి, ము
న్నే చూపంబడె నందుకు। నాచే నిన్నియు నిదర్శనంబులు సరిగన్.

క॥ *గ్రామపురోహితు నెవరున్। భూమండలమందు శ్రాద్ధభోక్తను జేయన్
బ్రేమింపఁగూడదని యొక। ప్రామాణ్యము చూపెనితఁడు పారులకగరే.

ఆ॥ కాంతుచేసి నేను గ్రామపౌరోహిత్య
మాచరింతునను చు నతని యూహ
అందుకని యొవిప్పె నకటయీ పంచాంగ
మెందుకనుచు మీరాలెంచినారో. 142

సీ॥ అలజగన్నాయుఁడైన యయోధ్యాదిపురుషున
కేనువక్త్రిములుంట యెంతనిజము
బ్రహ్మకుఁ దర్వాతిబ్రహ్మమైన వసిష్ఠ
ఋషి దోషకలితుఁడో యెంతనిజము
బ్రాహ్మణశాఖలం బ్రథమములో వైదిక
లే సంకరులుగాను యెంతనిజము
వెడచూపుచేఁ జూడఁబడెనీ యూకమసాలు
లిలను బ్రాహ్మణులాట యెంతనిజము

గీ॥ స్వర్ణకారశాస్త్రిపల్కినపల్కులివింత గాక యుంట యెంతనిజము
కష్టమనక నేను గ్రామపౌరోహిత్య। మాచరించుచుంట యెంతనిజము॥

తే॥ నిజముకాదో యగునో సెలిపితినిపుడద్ది
శ్రాద్ధభోక్తలుగను సలుపఁదగని
వారు మనుమతమున వర్తిల్లుచున్నారు
పెక్కుమంది వారిపేళ్లు వినుఁడు. 143

* 3 వ యధ్యాయము 151 వ శ్లోకములో గ్రామపురోహితుని శ్రాద్ధమందు భోక్తను జేయఁగూడదని చెప్పఁబడియున్నది.

* మనుస్మృతి తృతీయాధ్యాయము.

శ్లో॥ ...... యాజయంతి చయేపూగా స్తాంశ్చ శ్రాద్ధేనభోజయేత్॥ 151

బ్రాహ్మణుల కొక్కరికిఁదక్కఁ బరులకున్న
కర్మషట్కంబునం దధికారపదవి। 138
తే॥ * మనువులకుఁ దప్పుదిద్దెడి ఘను వసిష్ఠు
నేమొ తలక్రిందుచేయంగ నెంచి యితఁడు
చూపె మనుధర్మశాస్త్రమం దోపినన్ని
శ్లోకములు కొట్టులోనఁదా సాకిరియగు. 139

---

* 3 వయధ్యాయము 15,16,17వ శ్లోకములలో బ్రాహ్మణపురుషునకును బ్రాహ్మణేతరస్త్రీకిని బుట్టినవారు బ్రాహ్మణులుకారనియు నీచులనియు నందువలనషట్కర్మలఁ జేయుట కధికారములేదనియుఁ జెప్పఁబడియున్నది.

† ఈయధ్యాయములోని 19వ శ్లోకమునందుఁ బ్రాయశ్చిత్తమువలన నట్టిసంకరులకు శుద్ధికలుగనేరదని చెప్పఁబడియున్నది.

‡ 11 వయధ్యాయము 175వ శ్లోకములో బ్రాహ్మణుఁడు బుద్ధిపూర్వకముగాఁ జండాలస్త్రీనివివాహమాడినయెడలఁ జండాలుఁడగునని చెప్పఁబడియున్నది

§ 1 వయధ్యాయము 93,94వ శ్లోకములలో స్వయంభువగుబ్రహ్మ మొట్టమొదట తనముఖమునుండి బ్రాహ్మణులఁబుట్టించెనని చెప్పఁబడియున్నది

---

* మనుస్మృతి తృతీయాధ్యాయము.

శ్లో॥ హీనజాతిస్త్రియం మోహా దుద్వహంతో ద్విజాతయః। కులాన్యేవ నయంత్యాశు ససంతానాని శూద్రతాం॥15॥ శూద్రావేదీ పతత్యత్రే రుతథ్యతనయస్యచ। శౌనకస్యసుతోత్పత్త్యా తదపత్యతయా భృగోః॥16॥ శూద్రాం శయనమారోప్య బ్రాహ్మణో యాత్యధోగతిం। జనయిత్వా సుతంతస్యాం బ్రాహ్మణ్యాదేవ హీయతే॥17॥
శ్లో॥ వృషలీఫేనపీతస్య నిశ్వాసోపహతస్యచ। తస్యాంచైవప్రసూతస్య నిష్కృతిర్నవిధీయతే॥ 19

‡ మనుస్మృతియేకాదశాధ్యాయము.

శ్లో॥ చండాలాదిస్త్రియోగత్వా భుక్త్వాచ ప్రతిగృహ్యచ। పతత్యజ్ఞానతోవిప్రో జ్ఞానాత్సామ్యంతుగచ్ఛతి॥ 175

§ మనుస్మృతిప్రథమాధ్యాయము.

శ్లో॥ ఉత్తమాంగోద్భవా జ్జ్యైష్ఠ్యా ద్బ్రహ్మణశ్చైవధారణాత్। సర్వస్యైవాస్యసర్గస్య ధర్మతో బ్రాహ్మణఃప్రభుః॥ 93॥ తంహిస్వయంభూస్స్వాదాస్యా త్తపస్తప్త్వాదితోసృజత్। హవ్యకవ్యాభివాహాయ సర్వస్యాస్యచగుప్తయే॥ 94॥

ఆ॥ * ఎవరు మగతనాన కెడమయియుండిరో
ఎవరు పతితులుగను నేర్పఁబడిరొ
హవ్యకవ్యములకు నటువంటి బ్రాహ్మణుల్
కడునన ర్హులనుచు నుడివె మనువు. 144

క॥ కలుదాఁ ప్రవాఁడు గురుసతిఁ
గలిసి ప్రవర్తించువాఁడు కాంచనహారుఁడు
బలిరుఁ బ్రాహ్మణుగొంతుక
నులిమి యసుల్ తీయువాఁడునుం బతితు లిలన్॥ 145

ఆ॥ † యతియు బ్రహ్మచారి యనధీతవేదుండు
ధూర్తజనుఁడు కరము దుర్బలుండు
గ్రామయాజకుండు నేమింపఁదగరెవ్వ
శ్రాద్ధభోక్తలుగను జనులచేత. 146

ఆ॥ ‡ ఇడి దుకాణ మొకటి యెప్పుడద్దానిచే
జీవనంబొనర్చు క్షితిసురుండు
వైద్యుఁ డర్చకుఁడు పలలవిక్రేతయు
హవ్యకవ్యముల నన ర్హులరయ॥ 147

సీ॥ § గురుకార్యనిర్వాహకుఁడు గానివాఁడును
వడ్డిచేజీవించువాఁ డనగ్ని

---

* శ్లో॥ యే స్తేనపతితక్లీబా యేచ నాస్తికవృత్తయః। తాన్ హవ్యకవ్యయోర్విప్రా నన ర్హాన్ మనురబ్రవీత్॥ 150

† శ్లో॥ జటిలం చానధీయానం దుర్బలం కితవం తథా। యాజయంతి చ యేపూగా స్తాంశ్చ శ్రాద్ధే నభోజయేత్॥ 151

‡ శ్లో॥ చికిత్సకాన్ దేవలకాన్ మాంసవిక్రయిణ స్తథా। విపణేనచజీవంతో వర్జ్యాస్స్యు ర్హవ్యకవ్యయోః॥ 152

§ శ్లో॥ ... ప్రతిరోద్ధా గురోశ్చైవ త్యక్తాగ్ని ర్వార్ధుషి స్తథా॥ 153

జీతంబుగొని విద్యఁ జెప్పువాఁడును జీత
మొసఁగి విద్యల నేర్చుచుండువాఁడు
నిష్కారణంబుగ నిజపితన్ మాతను
గురుని ద్యాగము సేయు క్రూరతముఁడు
కొంపలుగాల్చెడికూళ కుండాశియు
గరదుండు సోమవిక్రయిజనుండు
జూదమాడునట్టిశుంఠ మిత్రద్రోహి
పుత్రునొద్దఁ జదువఁబూనువాఁడు
నేతదాదిమనుజులెల్ల శ్రాద్ధార్హులై
పిలువఁదగరటంచుఁ బలికె మనువు. 148

కం॥ మనుమతము ననుసరించిన
మనకున్ శ్రాద్ధములఁ దగినమనుజుఁడె దొరకం
డనివార్యపుఁ బద్ధతియిది
ఘనపారాశర్యమతము కలిఁ గ్రాహ్యంబౌ। 149

చ॥ అఘదమె గ్రామయాజకత యారయఁ గాని పరోపకారమౌ
స్వఘనతచూచుకొంచు ద్విజసంఘము యాజకయున్న నెవ్వరీ
లఘుకృతినాచరించెద, రిలాసురకర్మకమైనయాజనం
బు ఘటిలకున్న సాఁగుటెటు భూమిజనంబుల కర్మమార్గముల్.

శా॥ పౌరోహిత్య మొకింత నింద్యమయినన్ బ్రహ్మత్వబీజంబు, గో
కారాధ్యుండనునట్టి బ్రాహ్మణున కాయర్థం బిలం దప్పు, దా
ధీరుల్ మున్ను వసిష్ఠముఖ్యులును చార్ దీనిన్ విడంజాల, నో
పారుల్ బొత్తిగఁ దీసివేయుకుఁడు మీరా పాపంబటంచు చీపనిన్॥

ఉ॥ పాపము పాచితంబునను బాపుకొనందగు, నెంచిచూడఁగా
నీపని యరా ననన్యగతి, ... ంతకుమించిన హేతుశూన్యవృన్

---

...భృతకాధ్యాపకోయశ్చ భృతకాధ్యాపితస్తథా...॥ 156॥ ...అకారణపరిత్యక్తా మాతాపిత్రోర్గురోస్తథా...157...అగారదాహీ గరదః కుండాశీసోమవిక్రయీ...158...మిత్రధ్రుగ్ద్యూతవృత్తిశ్చ పుత్రాచార్యస్తథైవచ॥160॥

పాపము లాచరించుటకుఁ బాల్పడఁగూడదు కాని దీన నే
లోపము రాదు బాపలకు,లోకుల కొ నుపకారమింక నుర్॥ 152

సీ॥ పరఖండములకేగి బ్యారిష్టరీ లాలు
పాసుకావుటకా దనన్యగతిక
మబల రజస్వలయగామీఁద నుద్వాహ
మాచరించుటకా దనన్యగతిక
మపగతపతికయగానబలకుఁ బెండ్లిపై
నాసగొల్పుటకా దనన్యగతిక
ముడిగి వేదాభ్యాస మురుశిల్పములనెల్ల
నభ్యసించుటకా దనన్యగతిక
మితరశరణమైన యిత్యాదికము సేయ
బ్రాహ్మణునకుఁదగును బాపభీతి
ఒండుదిక్కు లేకయుండు పౌరోహిత్య
మొనరుపర్ ద్విజాతి కున్నె భీతి॥ 153

ఉ॥ * వేదవిరుద్ధధర్మము లవిశ్వసనీయము లంట,యెందుకీ
సోదె, యెవం డెఱుంగఁడిది,చూపెదు దా నెవియో యవే యగుర్
వేదవిరుద్ధముల్,దనదు వ్రేలనె తాఁదన కన్ను పొడ్చుకోఁ
గాదె యిటుల్ వచించుటలు,కానఁను ముగ్ధత సీతఁ డక్కటా. 154

సీ॥ తాఁ గనంబఱచిన తద్వజ్రసూచియే
విఖ్యాతమైనట్టి వేదమనియు

---

* 12 వ యధ్యాయము 95 వ శ్లోకములో వేదవిరుద్ధములగు ధర్మశాస్త్రములు ప్రమాణముగా నంగీకరింపఁబడవని యున్నది. మేము షోడశకర్మలుచేయుచున్నాము. మేము వేదోక్తముగాఁ గర్మలుచేయుచున్నాము. మాయాలుగా విశ్వబ్రాహ్మణులనిపిలువఁబడు మా బ్రాహ్మణులలో షోడశకర్మలుచేయించువా రున్నారు.

---

* మనుస్మృతి ద్వాదశాధ్యాయము

శ్లో॥ యా వేదబాహ్యాః స్మృతయో యాశ్చ కాశ్చ కుదృష్టయః। తాస్సర్వానిష్ఫలాః ప్రేత్య తమోనిష్ఠాహి తాస్స్మృతాః॥95॥

దానిలోన వసిష్ఠమౌని యూర్వశి
కన్న కుమారుఁడం చున్న దనియు
ఘనపురాణములఁ దజ్జని యన్యథాయుంట
పరఁగ నాచేఁ జూపఁబడినదనియు
అందుచేత వసిష్ఠు నంత రాళునిఁ జేయఁ
బూర్తిగా వీల్గాక పోయెననియు
చూచిచూచియుతఁడు శ్రుతివిరుద్ధంబైన
స్మృతి ప్రమాణమనఁగఁ జెల్లదనుచుఁ
జెప్పినట్టియొక్క స్మృతివాక్కుసాధించె
నెంతకష్టపడెనో యేమొకాని॥ 155

తే॥ * ఉత్తమంబగుశ్రుతిలోనె యూర్వశికి వ
సిష్ఠఋషి పుట్టలేదంచుఁ జెప్పఁబడియె
చదివియద్దాని రథకారజనములార!
మావసిష్ఠునిదిట్టుటల్ మానుడింక॥ 156

---

* ఋగ్వేదము 5వయష్టకము 3వయధ్యాయము 22వవర్గము

శ్రు॥ ఉతాసి మైత్రావరుణో వసిష్ఠోర్వశ్యా బ్రహ్మన్మనసోఽధి జాతః- ద్రప్సం స్కన్నం బ్రహ్మణా దైవ్యేన విశ్వేదేవాః పుష్కరే త్వాదదంత...సత్రేహజాతా విషితా నమోభిః కుంభే రేత స్సిషిచతుస్సమానం- తతోహమాన ఉదియాయమధ్యాత్తతో జాత మృషిమాహు ర్వసిష్ఠం.

వి॥ భా॥ ఉతాపిచ హే వసిష్ఠ! మైత్రావరుణ! మిత్రావరుణయోః పుత్రోసి, హే బ్రహ్మన్! వసిష్ఠ! ఊర్వశ్యా అప్సరసో మనసో ఽధిజాయం పుత్రస్స్యాదితి ఈదృశా త్సంకల్పాత్ ద్రప్సం రేతః మిత్రావరుణయో రూర్వశీదర్శనాత్ స్కన్న మాసీత్-తస్మాత్ త్వధిజాతోసి-తథాచవక్ష్యతే సత్రేహజాతావితిఋచి- ఏవంజాతం త్వాం దైవ్యేన దేవసంబంధినా బ్రహ్మణా వేదరాశినా అహం భువా యుక్తం పుష్కరే విశ్వేదేవా అదదంత అధారయంత-తథాచ అదితేర్మిత్రావరుణౌ జజ్ఞాతేఇతి ప్రకృత్య వక్ష్యతే...సత్రే బహుకర్తృకే యాగే హేతి పూరణః జాతౌ దీక్షితౌ మిత్రావరుణౌ ఇషితౌ ఋషితౌ స్వయమనైర్జనైః నమోభిః స్తుతిభిః కుంభే వాసతీవరే కలశే సమాన మేకదైవ రేత స్సిషిచతుః అసించతాం,తతో వాసతీవరాత్కుంభాత్ మధ్యాదగస్త్యః మానః శమిప్రమాణః

వ్రాసియుండలేదు. నిషేధింపనికార్య మాచరణీయమగునేని వామహస్తముతో భుజించుట కారంభింపవలసినదేనా ? దీనిని మనపంతులవా రంగీకరింతురా ? ఈమాటలకేమి కాని ధర్మశాస్త్రములు నిషేధింపకపోయినంతమాత్రమున నింద్యకార్యము లనింద్యకార్యములు కానేరవు.

మనపంతులవారు దక్షిణదేశమున బ్రాహ్మణులలో నంబూరివారను నొకతెగవారు రజస్వలావివాహములఁ జేసికొనుచున్నారుకాన బ్రాహ్మణుల కందఱికి నది యుపాదేయమని చెప్పుచున్నారు. శాస్త్రవిరుద్ధకార్యములు బ్రాహ్మణులలో నొకశాఖవారు చేసినంతమాత్రమున నవి యాచరణీయములు కానేరవు. కాదుకూడదు. ఒకతెగవా రాచరించినను నది ప్రమాణమగునని మనపంతులుగారు పట్టుఁబట్టెదరేమో ? అటులేని వీరవలెనె మఱియొకసంఘసంస్కర్తగారుబయలుదేరి యుత్తరదేశమున బ్రాహ్మణులలో నొకతెగవారగు గౌడులు మత్స్యములను భుజించుచున్నారు. కాన మనమును మత్స్యభుక్కులమై కలియుగభీములము కావలయునని వాదింతురు. వారి బోధానుసారము మనము మత్స్యములను మెక్కవలసినదేనా ? ఇందులకు మనపంతులవా రంగీకరింతురా ? అది తప్పుపని గాన నంగీకరింపమందురా ? వారు చెప్పిన మత్స్యభక్షణమును, మనపంతులవారు చెప్పిన రజస్వలావివాహములును దప్పుపనులె కాన మేమాచరింపమనిచెప్పినఁ బంతులవా రేమి చెప్పెదరు ? వా రేమిప్రత్యుత్తరము చెప్పెదరులే కాని బాపట్లసంఘసంస్కరణసభలో జరిగిన వింతలవిశేషముల యుక్తులంగూర్చి యించుక ముచ్చటించుకొందము.

బా ప ట్ల స ం ఘ స ం స్క ర ణ స భ.

రెండేండ్లక్రిందట బాపట్లలో గుంటూరుమండలసభానుబంధముగాఁ గావింపఁబడిన సంఘసంస్కరణసభకు మాలో శివపురపు వీరభద్రపాకయాజి గారు వెళ్ళియుండిరి. అందు సభ్యు లనేకవిషయములం జర్చించి తీర్మానించియున్నవారు. వానిలో నొకటి రజస్వలావివాహవిషయము. ఇది మిక్కిలి కనసొంపుగాను వినసొంపుగాను జర్చింపఁబడినది. అందుపన్యాసకులు రజస్వలావివాహములు వేదశాస్త్రయుక్తిచరిత్రానుభవహేతుయుక్తములైనట్టు లొకతీర్మానమును బత్రమునందు వ్రాసి ముందుచదివి యటుపై నుపన్యసింపఁగడంగిరి. ఉపన్యసించునపుడు పత్రికలో వ్రాసిచదివిన వేదశాస్త్రచరిత్రాది విషయములను విడిచి యుక్తిప్రసంగములతో నుపన్యాసము ముగించిరి. అందు ముఖ్యములు రెండుగలవు. వానినిమాత్ర మిచట వినిపించెదము.

(1) "మనము సాధారణముగా సంగడికిఁ (సంతకు) బోయి యొక యావును దీసికొనఁదలఁచితిమేని దాని పొదుగును జూచుకొని యెన్ని పాలిచ్చునో పిదికి పరీక్షించి కదా తీసికొనుచున్నారము. అట్లే మన మొక కన్యకను వివాహము చేసికొనఁదలంచు కొన్నను దానిని బాగుగాఁ జూచుకొనియే చేసికొనవలయును" అని సెలవిచ్చిరి. దానిని విని సభ్యులు గొల్లున నవ్విరి.

(2) మన మొక గుఱ్ఱమును గొనఁబోయితిమేని దానికి సుళ్లు మంచివిగనవి సరిగ నున్నవా లేవా యని పరిశీలించుకొని యటుపై నది వేగముగాఁ బరుగిడునో లేదో యని దానిపై నెక్కి కొంతదూరము నడుపుకొని యపుడా గుఱ్ఱమును గొనుచున్నారము. అటులనే కన్యనుగూడ బాగుగఁ బరిశోధించి వివాహమాడవలసియున్నది. ఇప్పుడట్లు గాక 8, 9, ఏండ్లబాలికను దలిదండ్రులు చూచి యామె వానికిష్టమైనం గాకపోదనే తమ పుత్రునికి ముడివేయుచున్నారు. కాని యిది యనుచితమని చెప్పిరి.

మనసోదరులు గోవును గొనఁబోయినవాఁడు ముందు పొదుగుఁ జూచి పాలుపిండుకొని యటుపై గోవును గొనినట్లు కన్యనుగని పరీక్షము గావించుకొనవలెననియు గుఱ్ఱమును గొనువాఁడు ముందు దానిపై నెక్కి చూచుకొని కొనినట్లు మనము కన్యను బరిశోధించి పాణిగ్రహణముఁ గావించుకొనవలెననియు వారి కోరికయములను వెలిఁబుచ్చియున్నారు వింటిరా? ఎటువంటి యుపమానములతో రజస్వలావివాహముల స్థాపింపఁ జూచిరో? ఇంత కంటె మోటుప్రసంగము లోకమునందు నా? ఈనాటి నూతన సంస్కర్తలనోట వెడలిఁ జెల్లినవి కాని పూర్వాచారపరాయణుల నోటినుండి వెడలియుండెనేని వెంటనె మనసోదరు లింకను వీరినిఁ బ్రాసిక్యూటు ఏలచేయలేదని కొందరు వేసియుందురనుటకు సందియము లేదు. ఇంతియుఁ గాదు. రజస్వలావివాహముల మాటతలంపఁగనె యింతచిన్నదిగానున్నఁ దమతల యింతదొడ్డగుచున్నదని చేతుల విప్పి చూపింపసాఁగిరి. అదివిని సభ్యులు పకపక నవ్విరి వింటిరా! రజస్వలావివాహముల మాటఁ దలంపఁగనే తలదొడ్డగుచున్నదఁట! వారి ప్రాయమా! యేఁబది వత్సరములను సమీపించియున్నది. వారా! సంస్కర్తలు. స్థలమా! మహాజనసభారంగము. పనియో! ధర్మచర్చ. ఈసందర్భములో రజస్వలావివాహములను దలంచుకొనఁగనే వారితల యుబ్బి దొడ్డు కాఁబోఁదొడగిన నిఁక రజస్వలయైనపడుచును బరిణయముఁ జేసికొనఁబోవు పతులు వారితల యెంత యుబ్బి యెంత దొడ్డగునో కదా! వీరివివాదమును విని మనతలగూడ దొడ్డగునని తలంచి వారివాదము నంగీకరించితిమా వెంటనే మఱియొక సంస్కర్తజ్ఞగారు జారత్వము తలంపఁగనే తనతల

దొడ్డగుచున్నదనియు, వేఱొకసంస్కర్తగారు చోరత్వమును దలంపగనే తనతల దొడ్డగుచున్నదనియుం జెప్పి జారత్వ చోరత్వములను సంఘమున నెలకొల్పుఁడని బోధింపఁజొత్తురు. వానినెల్ల మనము ప్రారంభింపవలసినదేనా? వీనిని మా సోదరు లామోదింతురా? ఈమాటలకేమికాని యీవెంటనే యుపన్యాసకుల వాదమును బలపఱచుటకై యొక సపోర్టరుగారు రంగస్థలము నధిష్ఠించిరి. వీరి కఱువదియేండ్ల ప్రాయమున్నదని వారిరూపము చెప్పకయే చెప్పుచున్నది. ముసలివారికిఁగూడ రజస్వలావివాహములపైఁగనే నోరూరఁజొచ్చినది. ఏమి! యీకలికాలమహిమ! అటులైన వీరు పదినిమేషములకాలము శ్రీమంత ఆచంట లక్ష్మీపతి బి. ఎ. ఎం. బి. సి. యం. గారిని స్వయంవరవివాహము గావించుకొనిన సతీతిలకమును బొగడిపొగడి తుదకుఁ దమకు నేడ్గురు పుత్రికలు కలరని చెప్పుచు నందైదవపుత్రికకో యీఆఱవపుత్రికకో యీ లక్ష్మీపతిగారిపత్ని యీడుబిడ్డయైయున్నదికాన రజోదర్శనానంతరస్వయంవరవివాహము లవశ్యకరణీయములని చెప్పుట కింతకంటె నెక్కువకారణము నేమి తెల్పవలెనని యడిగిరి.

కంటిరా! స్వయంవరవివాహముల బలపఱచువారి కారణప్రదర్శనము? దీనినిగని మనము స్వయంవరవివాహములు ప్రారంభింపఁగానే మనతెలివినిఁగనిపెట్టిన మఱియొక సంస్కర్తగారుబయలుదేరి "అదుగో! ఆవీధిని మద్యపానముఁజేసి మత్తెక్కి యొడలు తెలియక పడియున్నాఁడే యీరంగఁడు నా మూఁడవకోడలికిఁ దోడఁబుట్టినవాఁడు కాన మద్యపానము పరమపవిత్రమైనది. దీనింగూర్చి యింతకంటె నధిక నిదర్శనము దేనినిఁజూపవలయును! కాన నీయాచారము త్వరగా నాచరణలోనికిఁ దెచ్చి సంఘము నుద్ధరింపుఁడని యుపదేశింప మొదలిడును. దానిని మన మంగీకరించి యాచరించవలసినదేనా? దీనిని మనసోదరు లంగీకరింతురా? ఈరీతిగా సపోర్టరుగా రుపన్యాసమును బలపఱచి యుపన్యాసవేదికను దిగినతోడనే గుంటూరుపురవాసులును, న్యాయవాదికులశేఖరులును, సంఘసంస్కారశిరోమణులును, దేశోద్ధరణదీక్షాపరతంత్రులును, శ్రీ రామానుజాచార్యవర్యసాంప్రదాయసదాచారాచరణనిష్ఠాగరిష్ఠులును, సంఘోద్ధరణైకచిత్తులును, బాహ్యాచారవ్యాజపూర్వకదురాచారబోధక పూర్వాచారపరాయణోపన్యాసానన్యసామాన్యవిమర్శనవ్యాసరచనాచాతురీధురీణులు నగు శ్రీమాన్ వింజమూరి భావనాచార్యులవా రుపన్యాసవేదిక ముందునకునడిచి సభ్యుల సభాధిపతుల నిట్లు వేడుకొనిరి. అదేమన.

"ఇప్పు డింతవఱకు నుపన్యాసకులు రజోదర్శనానంతర స్వయంవరవివాహములు వేదశాస్త్రవిహితములని తా ముపపాదించిన తీర్మానములో వ్రాసిచదివిరికాని యేశాస్త్ర

మాణములఁజూపి సిద్ధాంతముఁజేసియుండలేదు. అందువలన నీవిషయమై లోకులు వేఱుగాఁదలంతురు. నాకైదునిమిషములకాలమవకాశమిచ్చెదరేని యాలోపమును బాపఁగలనని సెలవిచ్చిరి. ఆమాటవిని సభ్యులలో నీవిషయసంబంధమైన శాస్త్రచర్చవినుటయందు నాసక్తిగల సదస్యుల ముఖకమలములు వికసింపఁజొచ్చెను. వారికి సభాధిపులవకాశమొసంగిరి. అంతట శ్రీవారిట్లుపన్యసింప నొదలిడిరి. ఇట "సంస్కృతముంజదివినపండితులనేకులుండవచ్చును. వారందఱికిఁదెలిసినవిషయమే యిట నేఁజెప్పఁబోవునది. మనలోఁ బరాశరస్మృతియనునది యొకటి యున్నదఁటగదా. అందులో "అష్టవర్షాభవేత్కన్యా" యనుశ్లోకమున్నదఁట. అష్టవర్షాయనుమాటకుఁ బదియూఱెండ్లపడుచని యర్థమఁట. ఈ యర్థమెట్లువచ్చునన నదేదో సంస్కృతవ్యాకరణములో నొకసమాసమున్నదఁటగదా! దానింబట్టి "అష్టవర్షా" యనుపదమునకుఁ బదియూఱెండ్లది యని యర్థమువచ్చునఁట. ఆసంగతి యిక్కడనున్న పండితులకుఁగూడఁ దెలిసియుండునని నాయభిప్రాయము. ఇంతేకాదు "మాయింటిలో దేవతార్చనఁజేసెడి యాచార్యులుగారుకూడ మావైష్ణవులకు ముఖ్యమైన పాంచరాత్రాగమమందును రజస్వలా వివాహము చేయవచ్చునని యున్నదని చెప్పినట్లుగా నాకుఁ గొంచెము జ్ఞాపకమున్నట్లున్నది. కాఁబట్టి యీ రజస్వలావివాహములు శాస్త్రీయములని నాయభిప్రాయము" అని చెప్పి వారియుపన్యాసము ముగించినవెంటనే సభాధ్యక్షులును, నాంధ్రపత్రికాసంపాదకులును, సర్వధర్మమర్మజ్ఞశిరోమణులును, శైవమతాచారాచరణనిష్ణాగరిష్ఠులును, బండితరాట్టులును నగు శ్రీయుత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారు సభ్యుల నవలోకించి యీ రజస్వలావివాహ విషయము మీయంగీకారమునకుఁ బాత్రమైనదేనా? యని ప్రశ్నించిరి. ఆసభయందు సమావేశమైయున్న 900మందిసభ్యులలో నించుమించుగా 9మందిసభాసదులు చేతులెత్తిరి. మిగిలినవారు మౌనముద్రనువహించిరి. ప్రసిడెంటుగారు "ఆల్ పాస్" అని తీర్మానించిరి.

ఆరీతిగా నుపన్యాసములు 15నిమేషములలో ధర్మచర్చలుగావించుటయు నీవిధముగా సభాధిపులు సభాంగీకారమునుబడసి తీర్మానించుటయుఁ దటస్థించినపు డేధర్మములను మనముందఱ మాచరించి బాగుపడక చెడునదేమున్నది? శ్రీమాన్ వింజమూరి భావనాచార్యులవారు సభలోనున్న పండితులకుఁదెలిసినవిషయమేయనియు నది శాస్త్రములోఁగూడ నున్నట్లేయున్నదనియు, దేవతార్చకాచార్యులవారుగూడఁ జెప్పినట్లు జ్ఞాపకమున్నదనియుఁ జెప్పఁదొడంగిరి. ఇవియా శాస్త్రచర్చలు. ఈశాస్త్రచర్చ

లనువినియూ మనమాచరింపవలసినది. ఇట్టులఁజర్చింపఁబడిన విషయముల నేనా సభాధిపులు తీర్మానింపవలసినది. ఈతీర్మానముల నే నావత్రికలుపొగడి జనులాచరించవలెనని ప్రోత్సాహపఱుపవలసినది? వహ్వా రేవహ్వా!

డాక్టర్. సర్. యస్. సుబ్రహ్మణ్యఅయ్యర్ కె. సి. ఐ. ఇ. గారు.

"వెడ్నసుడేరివ్యూ" యను పత్రికకువ్రాసిన "రజస్వలావివాహములు" అను శీర్షికఁగలవ్యాసమును నాంధ్రీకరించి 23-1-15 తేదిని నాంధ్రదినపత్రికయందుఁ బత్రికాధిపతులు ప్రకటించియున్నవారు. అందలివిషయములు పెక్కులు విమర్శనార్హములైయున్నవి. గ్రంథవిస్తరభీతిచే వానినెల్ల విమర్శించుటమాని స్థాలీపులాకన్యాయమున నందుఁ గొన్నిటినిమాత్రమే విమర్శించి యుండువారిమనుచున్నారము.

(1) "హిందువులలో బ్రాహ్మణేతరులలో నూటికి 99 రజస్వలావివాహములే జరుగుచున్నవి. రజస్వలావివాహము చెల్లఁగూడదనినచో నీవివాహములన్నియు నశాస్త్రీయములే కావలసివచ్చును" అను నొకవాక్యమును వ్రాసియున్నారు. ఇంతకంటె విరుద్ధవాదము మఱియొకటి యుండనేరదు. బ్రాహ్మణేతరులలో 100కి 99 రజస్వలావివాహములే జరుగుచున్నవంట! ఈవాక్యమే వీరికి లోకజ్ఞానము లేదనిచాటుచున్నది. బ్రాహ్మణేతరులు, వైశ్యులు, రథకారులు, జంగములు, సాతానులు, దర్జీలు, లోనగువారును నైయున్నవారు. వీరిలో బాల్యవివాహములే గాని రజస్వలావివాహములు లేనేలేవు. ఇట్లుండఁగా మనడాక్టరుగారు బ్రాహ్మణేతరులలో 100కి 99 రజస్వలావివాహములు జరుగుచున్నవనివ్రాయుట లోకజ్ఞానములేకపోవుటచేత నేయని మనము చెప్పుకొనక తప్పదు. శాస్త్రాంగీకారముగలిగి రజస్వలావివాహములను జేసికొనుచున్నారనిచెప్పెడి క్షత్రియశూద్రులలోఁగూడ క్షత్రియులు రజస్వలావివాహములను మీరు గావించెదరాయని మనమ్మనడిగినచో మే మామాటను నవమానముగాఁ బరిగణింతుమని దక్షిణదేశనివాసులగు క్షత్రియసోదరులే పండితులైనవారే మాకుఁ జెప్పియున్నారు. క్షత్రియులును బ్రాహ్మణేతరులేకదా! ఇట్లుండఁగా మన యయ్యర్ గారు "బ్రాహ్మణేతరులలో 100కి 99 రజస్వలావివాహములే జరుగుచున్నవనివ్రాయుట" లోకానుభవదూరమనుటకు సంశయింపవలయునా? రజస్వలావివాహములను గావించుకొనుచున్న శూద్రసోదరులయందైనను మన. కె. సి. ఐ. ఇ. గారుచెప్పినట్లు 100కి 99 రజస్వలావివాహములు జరుగుటలేదు. వారును 100కి 50 బాల్యవివాహములు గావించుచున్నారని నిరాటంకముగాఁ జెప్పవచ్చును. ఇది హిందూసంఘములోని శూద్రు

సోదరుల నందఱిని మాదృష్టియందుంచుకొని చెప్పినమాట. ఇట్లుండఁగా, మనదేశము నందు మొదల్యారులు, పిళ్లెలు, నాయుళ్లు, లోనగువారు రజస్వలావివాహములు గావించుకొనుచుండఁగాఁ జూచి హిందూసంఘములోని బ్రాహ్మణేతరు లందఱు 100కి 99మంది రజస్వలావివాహములఁ జేయుచున్నారని వ్రాయుట యత్యాశ్చర్యకరము గానున్నది. రజస్వలావివాహము చెల్లఁగూడదనఁగానే "వివాహములన్నియు నశాస్త్రీయములే కావలసివచ్చు" నట! ఏమి! యీవాదము శూద్రులకు శాస్త్రీయములైన విషయములు వైశ్యులకును వైశ్యులకు శాస్త్రీయములైన విషయములు క్షత్రియులకును, క్షత్రియులకు శాస్త్రీయములైనవిషయములు, బ్రాహ్మణులకును శాస్త్రీయములే కావలయునా? జాతిధర్మములుకొన్ని భిన్నముగానుండఁగూడదా? బ్రాహ్మణుఁడు మాంసాహారము చేయఁగూడదనిన శూద్రులుచేసెడిమాంసాహారము నిషిద్ధముగునా? రాజా "ఖూనీ" చేసినవాని తలనఱికించుటకు నధికారముగలిగియుండిన క్షత్రియేతరులుకూడ నట్టియధికారముకలవారగుదురా? ఇట్టిప్రశ్నలెన్నియో నడుగవచ్చును. వానికేమి. బ్రాహ్మణులకు రజస్వలావివాహములు నిషిద్ధములని చెప్పినంతమాత్రమున శూద్రులుచేసికొన్న రజస్వలావివాహములు నిషిద్ధములగునని మన డాక్టరుగారు చెప్పుటయే నిషిద్ధముగానున్నది. పినతండ్రికూఁతురు వివాహమాడుట సోదరీగమనమగునని హిందువులు నిషేధించిన మహమ్మదీయులు పినతండ్రికూఁతును వివాహమాడుట నిషిద్ధముకానేరదు. హిందువులు గోమాంసభక్షణము పరమపాతక కార్యమని నిందించిన మహమ్మదీయులు చేసెడి గోమాంసభక్షణము వారికి నింద్యముకానేరదు. కాఁబట్టి బ్రాహ్మణులకు నిషేధములైన రజస్వలావివాహములు శూద్రులకు నిషిద్ధములని చెప్పుట ప్రమాదజనితము.

మన డాక్టరుగారు మఱియొక యాపాతరమణీయమగు వ్రాఁతను వ్రాయించియున్నారు. అదేమన? "బ్రాహ్మణులలో మాత్రము రజస్వలావివాహములు కూడవని యే శాస్త్రమందును విధింపఁబడలేదు" అనునది బ్రాహ్మణులకు రజస్వలావివాహములు పరమ నిషిద్ధములని యిందు శ్రుతిస్మృతిసూత్రపురాణేతిహాసజ్యోతిశ్శాస్త్రసుశ్రుతాదిశాస్త్ర చర్చలు సలిపినస్థలములందు నంతటను మేమిదివఱకు నిర్ధారణఁ జేసియున్నవారము. కాన మరల నిట్టివిషయమై ప్రత్యుత్తరము లనవసరములని వదలిపెట్టితిమి. ధర్మశాస్త్రములు బ్రాహ్మణులకు రజస్వలావివాహముల నిషేధించియుండఁగా మన కె. సి. ఐ. ఇ. గారు "బ్రాహ్మణులలో మాత్రము రజస్వలావివాహములు కూడవని యేశాస్త్రమందును విధింపఁబడలేదు" అని వ్రాయుట; వీరు "ప్రధానభాషయగు సంస్కృతమునే పూర్తిగా మఱచిపోవుటవలనఁ దటస్థించినదని తోఁచుచున్నది.

హిందువులు సంస్కృతమును మఱచిపోయినారా? యని ప్రశ్నింతురేమో? దానికిఁ బ్రత్యుత్తరమును మన డాక్టరుగారే "క్రమక్రమముగా మాతృభాషయగు సంస్కృతభాషాభ్యాసమును జ్ఞానసమార్జనమును సంఘమున క్షీణించినవి" అని యిచ్చియున్నారు. దీనింబట్టి సంస్కృతభాషాజ్ఞానము మనసంఘములోఁ గొలఁదిమందియందు మాత్రమే యున్నదనియుఁ జాలమందియందు క్షీణించినదనియుఁ దెలియవచ్చినదికదా? ఇందులోఁ గొందఱు సంస్కృతభాషనే మఱచిపోయినారని మన డాక్టరుగారే "హిందువులు ప్రధానభాషయగు సంస్కృతమును బూర్తిగా మఱచిపోయిరి" అను వాక్యముతోఁ దెలిపియున్నారు. ఇందువలన సంస్కృతము మాతృభాషగాఁగల యార్యులు వృద్ధియైనకాలఁదిని నితర దేశములకు వ్యాపించి యచటనున్న భాషనే తాము మాటాడుచుఁ గ్రమక్రమముగాఁ దమమాతృభాషయగు సంస్కృతమును మఱచిపోయినారని వారి యభిప్రాయమును వెల్లడించియున్నారని తెలియవచ్చుచున్నది. అట్లు సంస్కృతమును మఱచిపోయిన యార్యులలో మన డాక్టరు సర్. యస్. సుబ్రహ్మణ్యయ్యర్. కె. సి. ఐ. ఇ. గారు ప్రధానులని తలంచవచ్చును. వీరు సంస్కృతమును బూర్తిగా మఱచిపోయినారు. అందువలన వీరు ధర్మశాస్త్రములనేమియు నెఱుంగరు. ధర్మశాస్త్రము లెఱుఁగకపోవుటచేతనే "బ్రాహ్మణులలో మాత్రము రజస్వలావివాహములు కూడవని యేశాస్త్రమందును విధింపఁబడలేదు" అని వ్రాయఁగలిగిరి? లేకున్న వ్రాయరు.

హిందూసంఘమున హిందూధర్మశాస్త్రములననుసరించి యనుపనీతులగు బాలురు మరణించినపుడు వారికిఁ బరలోకక్రియలు వేదవిహితముగా జరుపుటకు వలనుగాదు. ఈ విషయము సర్వజనవిదితము. స్త్రీలకు వివాహమే యుపనయనము. అవివాహితలై యున్న కన్యలు అనుపనీతులగు బాలురవలెనే వేదవిహిత పరలోకక్రియల కర్హలుకారు. స్త్రీల కుపనయనస్థానీయమైనకర్మ వివాహమేయని మేమిదివఱకిందు శ్రీమదార్యనారాయణమూర్తిగారి యుక్తివాదమునకుఁ బ్రత్యుత్తరము చెప్పెడిచోట విస్తృతముగా విన్నవించియున్నారము. సంశయింపగలవారలు చూచుకొందురుగాక. ఇది యిట్లుండఁగా మన డాక్టరుగారు "స్త్రీలకవివాహితలుగానుండు స్వాతంత్ర్యము సహజముగాఁ గలిగియుండినను రజస్వలాత్పూర్వ వివాహాచారమునఁ బ్రతి స్త్రీయును వివాహము చేసికొని తీరవలయునను నిర్బంధమేర్పడుచున్నది. కాన నట్టియాచారము సదాచారము కానేరదు" అను నొకసాహసాతిసాహసవాక్యమును వ్రాసియున్నారు.

పురుషులనుపనీతులై యుండుటకు సహజస్వాతంత్ర్యము కలిగియున్నారని శాస్త్రకారులు చెప్పుచున్నారా? చెప్పుటలేదు. స్త్రీలకు వివాహమే యుపనయన

మని శాస్త్రములు ఘోషించుచున్నవి. ఇట్లుండ నవివాహిత (అనుపనీత) లుగానుండుటకు స్త్రీలకు సహజస్వాతంత్ర్య మెట్లువచ్చినది? వచ్చినదిపోండు. వారు మరణించినపుడు పరలోకక్రియలు లోపించుటలేదా? లుప్తపిండోదకక్రియలుగలవారికి సద్గతులు కలుగవని హిందూశాస్త్రము లన్నియు నొక్కుమొగి ఘోషించుచుండుటలేదా? అట్లు ఘోషించుచుండఁగాఁ దమవేదశాస్త్రమార్గములనడుచు హైందవస్త్రీలకు నవివాహితలుగనుండు సహజస్వాతంత్ర్య మెట్లువచ్చును? రాదు. రానపుడు "రజస్వలాపూర్వవివాహాచారమువలనఁ బ్రతిస్త్రీయును వివాహముచేసికొనితీరవలయునను నిర్బంధమేర్పడుచున్నది" అని మనడాక్టరుగారు విచారపడిన ఫలమేమి? రజస్వలలగువఱకు మనము కన్యలను వివాహముచేయక యుంచినయెడల వారిలోఁ గొందఱు యావజ్జీవము నవివాహితలుగనుండుట కభిలషింపవచ్చును. అట్టివారికి మరణానంతరమునఁ బరలోకక్రియలు లేమింజేసి సద్గతులు సంభవింపక పోవును. ఆకీడునలంచియే మనపూర్వులు స్త్రీలకు బాల్యమున వివాహము విధించియున్నారు. అటులేని క్షత్రియశూద్రులందు రజస్వలావివాహములు లేవా యని ప్రశ్నింతురేమో? వారిలో రజస్వలావివాహములు కలవు కాని పరలోకక్రియలు కలుగవను భీతిచేతనే వారు రజోదర్శనానంతరమునైనను బ్రతికన్యకకు విధిగా వివాహము చేయుచున్నారు. కాని యావజ్జీవము కన్యలవివాహితలై యుండుటకు నవకాశ మొసంగియుండలేదు. అట్లిచ్చుటను నాచారముకూడ లేదు. మన హైందవప్రభుస్థానములందుఁ గొందఱుకన్యకలకుఁ దగినవరులు లభింపమిని నించుమించు 90 సంవత్సరములవఱకు వివాహము లేకుండ నుండి యామెకు మరణచిహ్నములు కనుపడినతోడనే సద్గతిప్రదములగు పరలోకక్రియలు సంభవింపవని భీతిలియప్పటికిఁదగిన వరునిఁ గొనితెచ్చి యానాఁడు వివాహమును, మఱునాఁడు దహనమును గావించినవారు కొందఱుకలరని వినియున్నారము. విదేశములందుఁగూడ యావజ్జీవము నవివాహితలుగ నుండఁదలఁచిన స్త్రీసంఘమునందు నీతిబాహ్యప్రవర్తనము దినదినప్రవర్ధమానమగుచున్నదని యాదేశస్థులే వ్రాయుచున్నారు. ఆవ్యాసములను ముందు స్వయంవరవివాహములంగూర్చి ముచ్చటించుచోట వ్రాసెదము. అటుఁ జదువుకొందురు గాక. సర్వానర్థదాయకమైన యవివాహితలుగానుండు సహజస్వాతంత్ర్యము మనస్త్రీలకుఁగూడఁ గావలయునను కోరిక సంఘవినాశకులు కోరఁదగినదికాని సంఘసంస్కారులు కోరఁదగినది గాదని శ్రీయుతులగు మనడాక్టరు, సర్. యస్. సుబ్రహ్మణ్యయ్యర్ కె. సి. ఐ. గారు తెలిసికొందురు గాత.

చెప్పి మఱియు నిట్లనియె, 27

తే॥ "ఇట్లు వేదార్థమంతయు నింపె రేశుఁ
డభవుచెవిని భూతేశు నంబికేశు
నఖిలలోకేశు నంబాసహాయు శివునిఁ
జుట్టి వలగొని ముమ్మాఱు శుద్ధభక్తి. 28

తే॥ దండవన్నతు లొనరించి తగినయట్లు
స్తుతులుగావించి భయభక్తిరతి చెలంగ
దేవదేవు భవానీశు దీనసులభు
పూజచేసె మహానందపూర్ణుఁడగుచు"॥ 29

—♦ముక్తిభేదకథనము♦—

వ॥ అంత నప్పరమేశ్వరుండు రమేశ్వరున కిట్లనియె, 30

క॥ "ఇఁక మీఁద ముక్త్యుపాయము
సకలంబును జెప్పువాఁడ జలజేక్షణ! స
త్ప్రకటశ్రద్ధాభక్తుల
నకలంకత వినుము నీవు నఖిలముఁ దెలియన్"॥ 31

సీ॥ సన్ముక్తి యాత్మకు జ్ఞానంబుచేఁ గల్గు
కర్మజాలంబులఁ గలుగ దెందు
జ్ఞానంబు వేదాంతసద్వాక్యముల మహా
తాత్పర్యనిర్ణయత్వంబువలన
వెసజనించిన మనోవృత్తియందునఁ దను
దానెఱుంగుట యర్థతత్పరత్వ
మున నదె బ్రహ్మమైచను, దీనిచే నాత్మ
కజ్ఞాన మయ్యాత్మయందె యణఁగు
గీ॥ అణఁగునంతట ద్వైతమంచనఁగ లేదు
ద్వైతవస్తువు లేకున్న ధర శుభాను

భిమతియగును, నణఁగిన రాగమును వైర
మును దొలంగును, దొలఁగిన మనుజావకును. 32

క॥ ధర్మాధర్మము లెడలును
నిర్మలగతి నగియుఁ బోయు నేనియుఁ దనుపున్
గర్మదవిప. యోగ్యదియ తి
త్యక్తకర్మంబులు నైనను భవముగలుగదు పిదపన్ ॥ 33

వ॥ ఇది శ్రుతిసమ్మతంబు 34

మ॥ ఘటవిజ్ఞానము తో ఘటాజ్ఞతఁ దొలంగం జేయున ట్లాత్మవి
స్ఫుటవిజ్ఞానము తోఁ దదజ్ఞత నడంగున్ రజ్జుసర్పాజ్ఞతా
త్రుటనంబైనను సర్పమేగుగతి, సందేహంబు లేకాత్మయు
త్కటవిజ్ఞానము చేతఁ దోఁచినను మాయంబోయు సంసారమున్ ॥ 35

తే॥ అట్టి యజ్ఞానమూలమై యలరుచున్న
ఘోరసంసార మణఁగిన సారమైన
యాత్మతత్త్వైకవిజ్ఞానమబ్బు, నంత
తత్త్వమైయున్న బ్రహ్మంబు తానయగును॥ 36

వ॥ అప్పుడు సంసారముగుఁ జీవునకుఁ దోఁచు దృశ్యంబంతయుఁ
దత్త్వంబైన బ్రహ్మంబయ్యెతోఁచు మఱియును 37

తే॥ అవని నజ్ఞానమూలకర్మాది సర్వ
కారకగ్రామనిర్మితాకారమైన
కర్మ మజ్ఞానహారమా నె,కర్మమునను
లలితసాయుజ్యముక్తియుఁ గలుగునెట్లు॥ 38

క॥ కర్మమునఁ గలుగును ముక్తి। నిర్మలిస్వర్గంబు హో తెనశ్వరముగుటన్
నిర్మలము ముక్తిపదస్థితి। కర్మమునన్ లేదు కోటికల్పంబులకున్॥ 39

వ॥ అట్లగుటఁ బరమముక్తి కర్మంబునం గలుగదు, కేవల జ్ఞానం
బున సిద్ధించు,॥ 40

తే॥ కర్మ మది రెండువిధములఁ గానఁబడును
బాహ్యమాంతరమును, నందు వాచికంబు

కాయికంబును బాహ్యంబుగఁ గర్మలయ్యె
ఆంతరంబగు మానసం బరయ నెపుడు॥ 41

క॥ ఈకర్మద్వితయంబును బ్రాకటముగ బ్రహ్మమును భావింపుచును
శ్లోకత నెపు డుపాసన నేకాత్మతఁ జేయు జ్ఞానమెంతయుఁ గలుగున్॥

సీ॥ ఎవ్వఁడు దేవదేవేశుఁ ద్రిలోచను
శశిమౌళిఁ బాండురచారుదేహు
త్రిగుణాభిమానసందీప్తస్వరూపాఢ్యు
బ్రహ్మవిష్ణ్వీశ్వరోపాస్యు నభవు
పార్వతీయుతవామభాగు మహేశ్వరు
నీలకంధరు శివు నిగమవేద్యు
బాగు నుపాసనసేయు నాతనికుదయించు
శైవవిజ్ఞానంబు జలజనయన!
గీ॥ చిత్తకలుషంబు కలిగినఁ జెందు శివుని
దివ్యసారూప్య, మచ్చట దివ్యభోగ
మనుభవింపుచు విజ్ఞానమంది తుదిని
బొందు సాయుజ్యపద మొందు మౌనివినుత! 43

తే॥ చెలఁగి గుణమూర్తులందున శివుని శ్రద్ధఁ
దగ నుపాసనచేసిన దానివలన
రుద్రసాలోక్య మొంది నిరూఢమహిమ
క్రమముగా జ్ఞానమున ముక్తిగాంచు నతఁడు॥ 44

సీ॥ ఎవ్వఁడు శ్రద్ధచే నెంతయు రుద్రుని
పరమయోగమూర్తి నుపాసనంబు
సలుపు నాతఁడు రుద్రసామీప్యమును బొంది
యతిమనోహరభోగ మనుభవించి
చిత్తపాకము గల్గ శివునిసారూప్యంబుఁ
జెంది శివజ్ఞానసిద్ధివలన

శివునిసాయుజ్యంబుఁ జెందు, నెవ్వఁడు ధాత్రి
నత్యంతపరమమైయలరునీశు
గీ॥ మూర్తిసేవించు నాతఁడు ముఖ్యమైన
రుద్రసాలోక్య మొంది నిరూఢభోగ
మనుభవించి తత్సామీప్య మనుభవించి
యంత నారుద్రసారూప్య మనుభవించి॥ 45

కం॥ జ్ఞానంబుచేతరుద్రుని । మానితసాయుజ్య మొందిమలయుననటుగా
దేనియువిఘ్నాదులపడ । మానందతఁ జేరిభోగమనుభవమగుదుర్॥

వ॥ అక్కడక్కడ భోగంబు లనుభవించి భూతలంబున విశుద్ధం
బైన బ్రాహ్మణాన్వయంబున జనించు మాటియును,॥ 47

తే॥ ఎవ్వఁడైనను శ్రద్ధచే నిందిరేశ !
నిన్నుపాసించు నాతండు నిన్నుఁ జేరి
కాలమున నన్నుఁ జేరి భోగాళిఁదేలి
జ్ఞానమున ముక్తిగాంచును మానివినుత! ॥ 48

తే॥ కలుషమునఁ జేసి చిత్తవైకల్యమైన
విష్ణుసామీప్య మొంది యవ్విష్ణుదేవు
విమలసారూప్య మొంది యవ్విష్ణుమూర్తి
యమితసాలోక్యభోగంబు లనుభవించు॥ 49

క॥ నీపరమమూర్తిఁగొల్చెడి। యాపురుషుండొందు వేడ్కనమితసుఖంబౌ
శ్రీపతిసామీప్యపదం। బాప్తైనతఁడొందుముక్తినటు మోదమునన్ ॥50

సీ॥ అత్యంతపరమమైయలరునీమూర్తి నిం
దెవ్వఁ డుపాసన నెలమిఁ జేయు
నతఁడు నీసాలోక్య మనుభవించియు నీదు
సామీప్య మొందియు శార్ఙ్గి ! నీదు
సారూప్య మొందును సరవి, (నాపై)చిత్త
పరిపాక మెట్లట్లొ పరఁగ నాఁడు

విజ్ఞానమే మైన వెసఁగల్గు, మోక్షంబు
గనువంత, చిత్తంబు గలుషమైన
గీ॥ కడఁగి బ్రహ్మాది దివ్యలోకంబులొంది
యందు నతిదివ్యభోగంబు లనుభవించి
పిదపజనియించుఁ గ్రమముగాఁ బృథివియందు
ఇందు కించుకను సందేహ మింత లేదు॥ 51

సీ॥ ఎవ్వండుసతతంబు హృదయంబులోపల
నక్షమాలాధరు నమలమూర్తి
వరదాభయకరాబ్జు వరకమండలుపాణి
శారదాసహితు నీశ్వరుని విధిని
అతిభక్తిసేవించు నాతండు తద్బ్రహ్మ
సారూప్య మొందును శౌరి! శుద్ధ
చిత్తుఁడైనను నిన్నుఁ జేరు, నంతటనన్నుఁ
జేరి యద్వైతవిశిష్టమైన
గీ॥ జ్ఞానమొదఁగల్గి ముక్తుఁడౌ దానివలన
పక్వచిత్తంబుగాకున్న బ్రహ్మలోక
సౌఖ్యములఁగాంచి యాచారసహితమైన
వంశమునఁబుట్టి విజ్ఞానవంతుఁడగును॥ 52

తే॥ అటు పరమమూర్తిఁగొల్చిన యతఁడు బ్రహ్మ
భవ్యసారూప్య మొందును, పక్వచిత్తుఁ
డైనఁ గ్రమమున నన్నుఁజెందు, నట్లుగాక
యున్నఁ గ్రమముగ జనియించు నుర్వియందు॥ 53

తే॥ బ్రహ్మదేవుని యత్యంతపరమమూర్తి
రూఢిభజియించి బ్రహ్మసాలోక్య మొందు
పక్వచిత్తుండుగాకున్నఁ బరఁగ నచట
భోగములనొంది క్రమముగాఁ బుట్టు భూమి॥ 54

వ॥ మఱియు నెవ్వండు నిత్యంబును శ్రద్ధచేత దేవతాంతరం బుపాసనసేయు నాతండు చిత్తపాకానుగుణంబుగా మూర్త్యుత్కర్ష బలంబుచేత సాలోక్యాదిపదంబులొంది బ్రహ్మపదంబును విష్ణుపదంబును మహత్తరంబగు మత్పదంబును గ్రమంబుగా నొంది నావలన విజ్ఞానియై బంధవిముక్తుండగు, మఱి మందుండయ్యెనేని యక్కడ ననేకభోగంబుల ననుభవించి భూమియందు మానవుండై జన్మించు, సంశయంబు లేదు.

క॥ హరి! సర్వమార్గములందునఁ। బరమాత్మునిగ నన్నుఁ దెలిసి పరమశ్రద్ధా
పరుఁడౌ చాశుద్ధమూర్తిని। బరఁగఁ భజియించి చిత్తపాకానుగతిఁ ॥56

క॥ క్రమ మొప్ప నాకు పరమా
త్మమునూతిఁ భజించి నాదు దయ విజ్ఞాన
క్రమ మొఱఁగి ముక్తిఁ జెందును
విమలంబౌ వేదమార్గవిధ మిది తలఁపఁ ॥ 57

సీ॥ ఈలీలఁ గ్రమముగా నింతయు బాహ్యంపుఁ
గర్మంబుచే నన్నుఁ గాంచి నాదు
వలన శివజ్ఞానకలితుఁడై ముక్తుఁడౌ
నవిశుద్ధుఁడైన బాహ్యంపుఁగర్మ
మున నక్కడక్కడ ఘనత సాలోక్యాది
పదమంది పుణ్యానుభవమువలన
మరల భూమిఁ జనించి మఱి పూర్వవిధమునఁ
జెలఁగి కర్మంబులఁ జేయుచుండి

గీ॥ క్రమముగా ముక్తుఁడగుఁ జిరకాలమునకు
బాహ్యకర్మంబుచేత నోపద్మనయన!
అచిరకాలంబుననె ముక్తుఁడగుఁ దలంప
నాంతరంబైనకర్మంబు ననుసరింప॥ 58

క॥ అసమాంతరోపచారత
వసుధాస్థలి సతులు పతికి వల్లభలగున

ట్లసమాంతరోపచారత
పొసఁగన్ జంతువులు వల్లభులు నా కెపుడున్॥ 59

క॥ అరయఁగ బాహ్యపుఁగర్మము
కర మొప్పఁగ జ్ఞానసూచకంబగు నంత
స్థిరకర్మము శమదమముఖ
వరకృత్యము లవియు జ్ఞానవర్తన మెపుడున్॥ 60

వ॥ ఇది శాశ్వతశ్రుతిమతంబు,

శా॥ కాశీముఖ్యమహాస్థలంబులు శివాగారంబు, లచ్చోటులం
దాశాపాశముఁ గోసినిల్చినను దేహాంతంబునన్ జ్ఞానము
క్లేశంబై జనియించు మర్త్యునకు, లక్ష్మీనాథ! యెల్లప్పుడున్
బాశధ్వంసకరంబులౌ స్థలములన్ వర్తింప మేలయ్యెడిన్॥ 62

క॥ పదిరెండు వేల ప్రణవము
ముదమున నిత్యంబు సేయు మురహర! మరణం
బొదవిన పిమ్మటఁ గలుగును
మదమితవిజ్ఞానసిద్ధి మదనుగ్రహతన్॥ 63

సీ॥ శ్రీమన్మహానందసిద్ధపంచాక్షరి
ప్రణవంబుతోఁ గూడఁ బరఁగు నేని
అది షడక్షరియన నలరారు, నది దిన
దినము సహస్రంబుగను జపంబు
శ్రద్ధతోఁ జేసినజనుఁడు దేహత్యాగ
మైనపిమ్మటఁ గాంచు నైశ్వర్యైక్య
విజ్ఞానగరిమంబు వెస, దానిచే ముక్తి
గల్గు వేగంబుగాఁ గమలనయన!

గీ॥ బాహ్యకర్మంబు లెన్నైనఁ బరఁగ దేహ
మొదలినంతన విజ్ఞాన మొలమిఁ జేయు
అవియు సద్వృత్తులకుఁగాని యన్యులకును
సిద్ధిగా వెందుఁ దలపోయ సిద్ధచరిత॥ 64

తే॥ పాపులకునైన నశ్రద్ధపరులకైన
వసుధలో శివక్షేత్రైకవర్తనంబు
మరణమొందినయటుమీఁద మహితముక్తి
నిచ్చు నిస్సంశయంబిది నీరజాక్ష॥ 65

తే॥ మున్ను కోలాహలుండను మూర్ఖవృషలుఁ
డవిధిచోదితవృత్తిఁ గామాంధుఁడగుచుఁ
దండ్రివధియించి తల్లిని దాఁగ్రహించి
పోయెనంత వేదారణ్యభూమికడకు॥ 66

క॥ అచ్చటనతిమోహంబున
విచ్చలవిడిసంచరించి వెసఁజచ్చెనఁదా
నచ్చోటిమహిమకతమున
విచ్చెందత్పాపజలదవితతియు వేగన్॥ 67

క॥ అంతట మామకకరుణయు
నెంతయుఁబ్రసరింప నతఁడహేతుకమౌ వే
దాంతజ్ఞానముకలిమిని
చింతాసారమైన మోక్షసిద్ధింగాంచెన్॥ 68

క॥ అటుగనుక భక్తిచేతను
నిటలాక్షుమహాస్థలముల నిలుచుటవలనన్
ఘటియించుమోక్షకాముల
కటుల మహాముక్తివిభవ మత్యుత్త(మమై)"॥ 69

శా॥ ఈలీలన్ శివువాక్యముల్విని రమాధీశుండు నమ్రాంగుఁడై
యాలోచించి మహేశునిట్లనియె"వేదారణ్యమాహాత్మ్యమే
చాలంగావిననిచ్చపుట్టెను మహేశా! తెల్పవే"యన్న నా
శైలాధీశసుతేశుఁడిట్లనియెఁ దా సమ్యక్కృపాపూర్ణుఁడై॥ 70

ఉ॥ "సారసనేత్ర! తెల్పెదను సర్వజగద్ధితమైన తన్మహా
దారచరిత్ర మద్భుతము,తద్దయు భక్తిరతిన్ వినందగున్